# శ్రీ అవధూత చివటం అమ్మ




**శ్రీ అవధూత రామాలయ సాధు అమ్మ ఆశ్రమ సంఘం**

రిజి. నెం. 203/81

చివటం - 534 216, ఉండ్రాజవరం మండలం, ప.గో. జిల్లా.

# మాతృ స్వరూపిణి అమ్మ

1) గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురువేనమః

2) అక్షరద్వాద్వరేణ్యత్వాద్ధూత సంసార బంధనాత్
తత్త్వమస్యాది లక్ష్యత్వాదవధూతి ఇతీర్యతీ॥

నాశరహితుడు, శ్రేష్ఠుడు, సంసార బంధాలను విదిలించి వేసినవాడు, తత్త్వమసి (తాను మసైపోవడమే) అనే మహా వాక్యానికి లక్ష్యమైనట్టివారిని అవధూత అంటారని పై శ్లోకం భావన. "తాను" మసైపోగా మిగిలినదే తానుగా జీవించిన మహామహితాత్మురాలు "శ్రీ చివటం అమ్మ". అటువంటి ఉత్తమ అవధూత శ్రీ చివటం అమ్మ పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు సమీపాన, గోస్తనీ నదీ తీరాన గల చివటం అనే ఒక పల్లెటూరులో సుమారు 6 దశాబ్దాల పాటు నివసించి తన ప్రేమతో ఎందరివో హృదయాలను "ఆధ్యాత్మికత" వైపు మరలించి ఉన్నత స్థితికి చేర్చారు. అమ్మ గారికి తల్లిదండ్రులు పెట్టిన పేరు అచ్చమ్మ. వీరి జన్మస్థలము తణుకు పట్టణానికి సుమారు 6 మైళ్ళ దూరంలో ఉన్న రేలంగి గ్రామము. అమ్మ



గారికి చిన్న వయసులోనే వివాహం జరిగినది. అమ్మ గారికి 20 సంవత్సరముల వయసులో ఒక కుమారుడు జన్మించాడు. రేలంగిలో జీవనం సరిగా గడవకపోవడం వలన వీరు చివటం వచ్చి స్థిరపడ్డారు. అమ్మ గారి భర్త గరగ అంజయ్య గారు పండ్లు, కూరగాయల వ్యాపారం చేసేవారు. వచ్చిన డబ్బులతో తప్ప తాగి ఇంటికి వచ్చి అమ్మను కొడుతూ ఉండేవారు. సహనానికి మారు పేరు అచ్చమ్మ గారు. తన కష్టాలకు ఎవరూ కారకులు కారనే అవగాహనే అమ్మ ఓరిమికి పునాది. అమ్మ బడి చదువులు చదువుకోలేదు. అమ్మకు "రామ నామ"మంటే ఎంతో ప్రీతి. అమ్మ నోటి వెంట "కృష్ణా రామా" అనే పదాలు తప్ప మరేమీ వచ్చేవి కావు. ఏ పని చేస్తున్నా ఆమె హృదయంలో రామ నామస్మరణ నిరంతరం జరుగుతూ ఉండేది. ప్రతీ ఒక్కరిలో రాముని చూసుకొనేవారు. భర్త పెట్టే హింసలను అమ్మ మౌనంగానే భరించేవారు. భర్తకు ఎన్నడూ ఎదురు చెప్పేవారు కారు. ఏ జన్మలోనో మిగిలిపోయిన ఋణానుబంధాన్ని తీర్చుకోవడానికిగాను బహుశా అమ్మ అంజయ్య గారి భార్య అయ్యుంటారు. ఆ ఋణం తీరిపోయింది కాబోలు, అమ్మ ఒక రోజు తన కుమారుని జాగ్రత్తగా చూడమని

అత్తగారితో చెప్పి వెళ్ళిపోయారు. భగవంతునికి అంకితమైపోయారు. అమ్మ మొదట్లో చిన్నాయిగూడెం వెళ్ళి అక్కడ ఒక భక్తుని ఇంట్లో ధ్యానంలో మునిగిపోయారు. అమ్మ తల్లివాళ్ళు అమ్మ గారిని వెతుక్కుంటూ వచ్చి రేలంగి తీసుకు వెళ్ళారు. నెల రోజులు అక్కడ ఉండి తిరిగి చిన్నాయిగూడెం వెళ్ళిపోయారు. అక్కడ నుండి మన్నెం జగన్నాధపురంలో 12 సంవత్సరములు ఉండి చివరకు చివటం చేరారు.

## అవధూత అచ్చమ్మ దినచర్య

పాలకొల్లు వద్ద లక్ష్మీపాలెం అనే గ్రామంలో అమ్మ గారికి శ్రీ సాధూరాం బాబాజీ ద్వారా అవధూత లక్షణాలు అలవాటయి "దిగంబరి"గా ఉండిపోయారు. చివటంలోని వారంతా అమ్మను దైవంగా భావించేవారే గాని వారి దిగంబరత్వాన్ని చూసి హేళన చేసేవారు కాదు. అమ్మ దిగంబరి అయిననాటి నుంచి "భిక్ష" చేసేవారు. సాధారణంగా అమ్మ భిక్షకు వచ్చే వేళల్లో పురుషులు ఆమెకు ఎదురుపడకుండా ప్రక్క వీధుల్లోంచి వెళ్ళిపోయేవారు. క్రొత్తవారైతే రోడ్డు దిగి ఒక ప్రక్కగా ఒదిగేవారు. అమ్మ దిగంబరంగా ఉండటం వలన పిచ్చామె అనుకొని పిల్లలు



రాళ్ళతో కొట్టేవారు. ఒళ్ళంతా నెత్తురు కారుతున్నా వారిని ఏమీ అనక ఆశీర్వదించేవారు. తనను గేలి చేసినవారిని కూడా అమ్మ మౌనంగానే ఆశీర్వదించేవారు. అమ్మ మితభాషి. మౌన ప్రార్థనలోనే నిజమైన శక్తి ఉంటుంది అన్నది అమ్మ భావన. సన్నిహిత భక్తులతో అవసరమైనంత మాత్రమే మాట్లాడేవారు. అమ్మ నవ్వు తమాషాగా ఉండేది, ఆమె నోరు తెరచి నవ్వేవారు కాదు. మూతి మూసుకుని ఉహు, ఉహు అని నవ్వేవారు. ఎంత ఎక్కువగా నవ్వు వచ్చినా సరే చిన్నగానే నవ్వేవారు. అమ్మ ఎక్కువగా పద్మాసనం వేసుకొని కూర్చునేవారు. ఒక్కోసారి అమ్మ ఒక కాలు మీదే నిలబడి ఇంకో కాలు ముడుచుకొని అలా గోడకు ఆనుకొని నిలబడేవారు.

అమ్మ మట్టిపాత్రలో భోజనం చేసేవారు. అమ్మ రోజూ భిక్ష ఉదయం 9 గంటలకు చేసేవారు. మొదటి రోజుల్లో చేతిలో వేయించుకొని తినేవారు. ఒకోసారి అలా వెళ్ళిపోతున్న అమ్మను ఆపి కొందరు చేతిలో ముద్దలు పెట్టేవారు. ఇంటి ముందు నిల్చుని భిక్షాందేహి అనేవారు కాదు. తనకు నచ్చిన ఇండ్లకు వెళ్ళి వంటగది లోపలికి వచ్చి చిన్నగా దగ్గేవారు. భిక్షను తనే

గిన్నెలో చేయి పెట్టి తీసుకొనేవారు. భిక్ష తీసుకొని వస్తూ దారిలో కనిపించిన పిల్లలకు, పేదవారికి, కుక్కలకు పెట్టి మిగిలింది తాను తినేవారు. అమ్మకు పడుకోవడానికి పట్టుపరుపులు, దిండ్లు లేవు. ఒక మనిషి మాత్రమే పడుకునే వీలుండే ఒక చిన్న గదిలో నేలపైన పరచిన చెక్కలపై పడుకొనేవారు. తన గదిలోనికి ఎవర్నీ రానిచ్చేవారు కాదు. ఆ గదిలోనే చిన్న అటక ఉండేది. దాని మీద ఏవో కొన్ని పచ్చళ్ళు, ఇతర వస్తువులు దాచి ఉంచేవారు.

అమ్మను చూడటానికి వచ్చిన భక్తులు అమ్మ కుటీరానికి అనుకొని ఉన్న రామాలయంలో పడుకొనేవారు. ఈ గుడిలో అమ్మ ప్రతీ రోజు మధ్యాహ్నం "సత్సంగం" చేసేవారు. సాయంత్రం పూట "సత్సంగం", "భజన" చేయించేవారు. ఈ గుడికి ఎంతోమంది మహనీయులు విచ్చేశారు. అందువలన ఈ గుడి ఎంతో పవిత్రమైనది.

అమ్మ ఎక్కువగా "భగవద్గీత" చదివించేవారు. "యోగవాసిష్టం", "సాయిలీలామృతము" మరియు ఇతర మహాత్ముల చరిత్రలు ఎక్కువగా చదివించేవారు. అమ్మకు



పిల్లలంటే చాలా ఇష్టం. ఎప్పుడూ రామాలయం వద్ద అమ్మ సన్నిధిలో చాలామంది పిల్లలు ఆడుకుంటూ ఉండేవారు.

## అమ్మ రామభక్తి

అమ్మకు చిన్నప్పటి నుండి శ్రీరాముడంటే చాలా ప్రీతి. అందుకే ఎప్పుడూ రామ నామమును స్మరిస్తూ ఉండేవారు. తన దగ్గరకు వచ్చినవారికి రాముణ్ణి తలచుకోమని చెప్పేవారు. అమ్మ చాలాసార్లు భద్రాచలం వెళ్ళి రాముణ్ణి సేవించుకొని వచ్చేవారు. అమ్మ రాముని మీద పాటలు పాడుతూ ఉండేవారు. అమ్మకు "బ్రూహిముకుందేతి" అనే కీర్తన చాలా ఇష్టము.

రాముడే నా పంచప్రాణము - భూమి దేవత సాక్షిగా
ఏమరక నాదు సుతులను విడువకుండిడి
మునివరా - గురువరా సద్గురువరా
ఎండవానల తిప్పకుండుడి - ఏమి ఎరుగని బాలలు
వేళ తప్పక బువ్వపెట్టుడి - గురువరా సద్గురువరా

1) శ్రీరఘురామా సీతారామ
రామరామ రఘు రామ రఘు రామ
రామరామ యని ధ్యానము చేయరా
హరాహరా నారాయణా నారాయణా
పావన రామా పావన రామా
రామారామా రామారామా

2) రామ రామ పరాత్పర
రామ రామ శివ శివ
రామ రామ ప్రణవ స్వరూప
రామా రామా జానకి రామా
వీరాంజనేయ రామాంజనేయ
శ్రీ హరి హరి హరి
శ్రీ కృష్ణ పరమాత్మ శ్రీ కృష్ణ పరమాత్మ

3) కలిమి రామా కలిమి రామా
పట్టాభిరామా కలిమి రామా
పట్టాభిరామా పట్టాభిరామా
పట్టాభిరామా పట్టాభిరామా
అయోధ్య రామా అయోధ్య రామా



అయోధ్య రామా అయోధ్య రామా
కారుణ్య రామా కారుణ్య రామా
రామారామా రామారామా
దైవం గురువు రామారామా
దైవం గురువు రామారామా
శాంతి రామా శరణు రామా

4) పరులను దూషించకే ఓ మనసా
రామరామ రామరామ అనవే
సురులు మునులతో కూడి కదలినాడే
నా బాలదైవమే కోదండరాముడు
తాటకిని వధించి తపస్సులను రక్షించి
బయలుదేరేవాడే బాలదైవము
నా బాలదైవము కోదండరాముడు

## భక్త ప్రియురాలు అమ్మ

అమ్మ ఏనాడు చిల్లర మహిమలు ప్రదర్శించలేదు. "అమ్మ వాక్కు బ్రహ్మ వాక్కు". ఎవరైనా క్రొత్తగా భక్తులు అమ్మ దర్శనానికి వస్తే వారు వచ్చే కాలానికి, ఆ వచ్చినవారి ఇష్ట

దైవ పటాన్ని ఎదురుగా పెట్టి ఉంచేవారు. అన్ని దైవాలు తమ రూపమేనని చెప్పకనే చెప్పారు. అమ్మ వద్దకు వచ్చే భక్తుల్లో ఎక్కువమంది తమ కష్టాలు తీర్చమనో, తమ రోగాలు తగ్గించమనో కోరుతూ వస్తూ వుండేవారు. భక్తులు అమ్మను ధ్యానించగానే తమ కష్టాలు తొలగిపోయేవి. అలాగే సత్సంగంలో ఏమైనా ధర్మ సందేహాలు వస్తే ఆ సత్సంగం పూర్తి అయ్యే లోపు వారి సందేహాలు తీరేవి. అమ్మ కృప ఉన్నవారికి సంసారంలో అసహ్యంగా, భరించలేనివిగా తోచే సంఘటనలు, సన్నివేశాలు కూడా ప్రియమైనవిగా మారిపోయేవి.

సాధారణంగా అవధూత స్థితిలో ఉన్నవారికి "కర్మాచరణ" అనేది ఉండదు. ఏమీ చేయకనే వారి నుండి బ్రహ్మాండమైన కార్యకలాపాలు జరిగిపోతూ ఉంటాయి. కానీ అమ్మ మాత్రం ఒక్క విషయంలో తద్భిన్నంగా కన్పిస్తారు. వారు అవధూత అయినప్పటికీ వారిలోని అవధులు లేని మాతృ ప్రేమ మాత్రం అలానే ఉండిపోయింది. బాహ్య ప్రపంచపు మాయలో చిక్కిన మన హృదయాన్ని బయటకు తీయడానికి అమ్మ అవతరించారనిపిస్తుంది.



అమ్మ వద్ద ఏదైనా కోరినప్పుడు అవుతుంది అని కూడా ఎప్పుడూ అనేవారు కాదు. "రాముడు మేలు చేస్తాడులే బాబు" అనేవారు. ప్రతీదానిని తన పరంగా కాక శ్రీరాముని పరంగా చెప్పేవారు. "రాముని అనుగ్రహం లేకుండా ఎవ్వరికీ ఎవ్వరూ మంచినీరు కూడా ఇవ్వరు" అన్నారు అమ్మ. అసలైన మహాత్ములు ఎప్పుడూ తమ శక్తిని నిగూఢంగా ఉంచుతారు. జనం వేలంవెర్రిగా తమ చుట్టూ మూగడం వారికి ఇష్టం ఉండదు. విభూతి, కుంకుమ సృష్టించడం లాంటి చిల్లర మహిమలు ఎప్పుడూ చేయరు.

ఎంతగా దాచిపెట్టాలని ప్రయత్నించినా సూర్యుని తేజస్సు, కస్తూరి వాసన ఎలా దాగిఉండలేవో అలాగే మహాత్ముల మహిమ కూడా అప్పుడప్పుడు వెల్లడి అవుతూ ఉంటుంది. అమ్మ తన నిజస్థితిని బహిర్గతం చేసిన సంఘటన ఒకటి తెలియవచ్చింది. ఒకసారి చివటంలోని పార్వతీ దేవి గుడిలో విగ్రహ ప్రతిష్ఠ జరుగుతున్నది. ప్రతిష్ఠ అనంతరం అన్న సంతర్పణ జరుగుతున్నది. అమ్మ గారు తన శిష్యులతో కలసి నడుస్తూ సింహద్వారం నుండి ఆలయంలోకి ప్రవేశించారు.

అక్కడ ఉన్న పెద్దలందరూ అమ్మ గారొచ్చారు, అమ్మ గారొచ్చారు అని కంగారుగా లేచి నిలబడ్డారు. అమ్మగారు అందరి మధ్య నుంచి నడచుకుంటూ వెళ్ళి అన్న రాశి దగ్గర ఆగారు. అమ్మ తమ భిక్షా పాత్రలోని భిక్ష అందులో కలిపారు. తరువాత అన్న రాశి అన్నం తీసుకొని ఉచ్ఛిష్టం చేసి అన్న రాశిపై చల్లారు. తరువాత భిక్ష తీసుకుందాం అని సైగ చేసి అక్కడివారితో కలసి భోజనం చేసారు. పార్వతీదేవికై నివేదించబడిన అన్నాన్ని తాము ఉచ్ఛిష్టం చేసి అందరికీ పంచమన్నారంటే అమ్మ తామే జగన్మాతయైన పార్వతీ దేవి అని చెప్పకనే చెప్పినట్లు కదా!

## అమ్మ - ఇతర మహాత్ములు

"ప్రేమకు అర్హతలతో పనిలేదు, చంద్రుని వెన్నెలలా అమ్మ ప్రేమ అందరి మీద సమానంగా ప్రసరిస్తూ ఉంటుంది, అదే మహాత్ములలోని ప్రత్యేకత" అన్నారు శ్రీ భరద్వాజ మాస్టారు గారు. "అమ్మను సేవించడం అసలైన ఉపాసన" అని శ్రీ స్వామి పూర్ణానందులవారు అన్నారు. "అమ్మ భగవద్గీతను మించి



పోయింది" అంటారు ఒక మహాత్ముడు. "అమ్మ సన్నిధి కాశి, అమ్మనెప్పుడూ విడిచిపెట్టకు, నువ్వింక ఎవరి దగ్గరకు వెళ్లనవసరం లేదు" అని భారతదేశంలో ఉన్న గొప్ప మహాత్ములలో ఒకరు అన్నారు. "అమ్మ పూర్ణావధూత" అని శ్రీ మళయాళ స్వామి అన్నారు. "అమ్మ పరమహంస, అమ్మకు ఎవరూ సాటిలేరు" అని బాల బ్రహ్మానందస్వామి అన్నారు. "అమ్మను వదలకండి, అమ్మ సామాన్యమైనది కాదు, అమ్మ సంగతి అమ్మ సమాధి అయిన తరువాత కాని మీకందరకూ తెలియదు" అని ఆయన చెప్పారు. శ్రీ సాధూరాం బాబాజీ గారు "అమ్మ నాకంటే పై మెట్టులో ఉంది" అని సెలవిచ్చారు.

శ్రీ లక్ష్మణ యతీంద్రుల వారు అమ్మ సమాధిని దర్శించి వేనోళ్ళ ప్రస్తుతించిరి. దేశంలో కెల్లా దిగంబరత్వం ఆధారంగా చేసుకొన్న ఏకైక అవధూత అమ్మ. అమ్మ నివాసం ఆలయమే! "భాష యాస కావచ్చు, భావంలో అలాంటి మనిషి లేరు. అమ్మ సేవకుండే విలువ అనంతమైనది" అన్నారు ఒక గొప్ప మహాత్ముడు.

## అమ్మ మహాసమాధి

దాదాపు 60 సంవత్సరాల పాటు చివటంలోను, పరిసర గ్రామములలోను సంచరించి తమ అవతార కార్యాన్ని నిర్వహించిన అమ్మ శరీర త్యాగం చేసే సమయం ఆసన్నమైనది. ఆమె తాము సమాధి చెందబోతున్నామని ముందుగానే చూచాయగా తమ చెంత ఉన్నవారికి తెలియచేస్తూ వచ్చారు. 1981 మే 31వ తేదీ నుండి అమ్మకు జ్వరం వస్తూనే ఉంది. అంత జ్వరంలోను, అమ్మ తన దైనందిన కార్యక్రమాలను యధావిధిగా కొనసాగించారు. రోజులు గడిచే కొద్దీ అమ్మ ఆరోగ్య పరిస్థితి క్షీణించసాగింది.

అమ్మ ఇక సమాధి చెందుతారు అని గ్రహించి ఏడుస్తున్న భక్తులతో అమ్మ "ఆడది కంటనీరు పెట్టకూడదే, ఇంటికి జయం కాదే, కంటనీరు కంటిలోనే ఉండాలి" అనేవారు. పోట్లాడుకునేటప్పుడు ఎవరైన రెండు అంటే పది అనకూడదు. ఎప్పుడు ధృఢంగానే ఉండాలి, ఏడవకూడదు. గుమ్మము లోనికి వచ్చినవారికి ఒక్క ముద్ద చేతిలో పెట్టి, మంచి నీరు ఇవ్వాలి.



అలాగైతే పైకి పోతారు. ఈ గ్రామనికి "చివటపురం" అనే పేరు వస్తుంది అని చివరగా చెప్పారు.

సుమారు 12 గంటలు కావస్తుండగా అమ్మ ఒక్కసారిగా మూలగడం మాని ఈశాన్యమూలగా చూస్తూ "వస్తున్నాను ఉండు" అని గద్దించి పలికారు. అక్కడ ఉన్నవారితో కొబ్బరికాయ కొట్టి హారతి ఇమ్మన్నారు. అమ్మ హారతి ఇచ్చాక సరిగ్గా రాత్రి 12 గంటల 5 నిమిషాలకు భౌతిక శరీరాన్ని త్యజించారు. అంటే 8-6-1981 సోమవారం రాత్రి 12 గంటల 5 నిమిషాలకు (తెల్లవారితే మంగళవారం) దుర్మతి నామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ సప్తమీ సోమవారం నాడు అమ్మ సమాధి చెందారు. సాధుస్త్రీలు వేద ఘోష చేస్తుండగా 10-6-1981 (జ్యేష్ఠ శుద్ధ నవమి) సాయంత్రం 4 గంటల 20 నిమిషాలకు అమ్మ దేహాన్ని సమాధిలో కూర్చుండబెట్టారు.

అమ్మ సమాధి చెందిన తర్వాత చివటం వచ్చిన ఒక మహాత్ముడు "సత్యమైన ప్రేమకు వియోగము లేదు - త్యాగమే దానికి గీటురాయి" అని అమ్మ కుటీరంలో గోడ మీద వ్రాసారు. భక్తులు, నిత్యసత్యులైన అమ్మను ఇలా స్తుతించారు :

శ్లో॥ మాతరం అచ్చమాం నిత్యం గోస్తనీ తట వాసినీం
జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం సర్వదా ప్రణమామ్యహమ్

శ్లో॥ వందేహం సర్వకాలేషు శ్రీ శైవ మఠవాసినీం
మాతరం అవధూతాంబాంశుద్ధ సత్త్వ స్వరూపిణీం॥

అమ్మను చూచినవారు, అమ్మ అనుగ్రహం, ఆదరణ పొందినవారు, ఈనాటికీ కూడా అమ్మ జ్ఞాపకాలతో, అమ్మ తమపై చూపిన ప్రేమను, కరుణను మరల, మరల గుర్తు చేసుకుంటూ, అమ్మ సమాధిని దర్శించుకుంటూ, శ్రద్ధాభక్తులతో అమ్మను సేవించుకుంటున్నారు.

అమ్మ ఉండగా అమ్మను చూసిన భాగ్యం కలగనివారు కూడా ఎవరో చెప్పగా వినడం వల్లనో లేక అమ్మ చరిత్ర చదవడం ద్వారానో అమ్మను గురించి తెలుసుకొని అమ్మ యొక్క దివ్యమైన ప్రేమను అనుభవించి అమ్మ స్మరణలో జీవిస్తూ, అమ్మ చూపిన మార్గంలో నడవడానికి ప్రయత్నం చేస్తున్న భక్తులు ఎందరో దేశ విదేశాల్లో కూడా ఈనాడు ఉన్నారు.



## అమ్మ అమృత సూక్తులు

1) తాను మసి అవ్వడమే తత్త్వమసి.
2) అహం చస్తే బ్రహ్మమే.
3) రాముడు, కృష్ణుడు అన్ని నామాల ముద్ద అయినదే విభూతి.
4) మృత్యువుని తినేది రామనామమే.
5) కోపం వస్తే నీళ్ళమీద గీతలాగా ఉండాలి కానీ ఎక్కువ సేపు ఉండకూడదు.
6) గురువు అనేవారు దారి చూపిస్తారు, ఆ దారిన నడచి గమ్యం చేరవలసింది నువ్వే.
7) పాదు పెట్టందే కాయెట్టావత్తదే?
8) ఆత్మ జ్ఞానం అనే విత్తనం మొలకెత్తాలంటే సాధన అనే దుక్కి దున్నాలి.
9) రామా రామా అంటూ కూర్చో - మనస్సు తిరిగి తిరిగి వేరే దారిలేక అదే నిలుస్తుంది.
10) ధ్యానం బంగారు ముద్ద వంటిది, ధ్యానానికి మించినది ఏదీ లేదు.
11) మన నీడ పడేంత మేర తప్ప దృష్టి పైకి పోనీయకూడదు.

12) కన్ను పెద్ద గుమ్మం, నోరు దొడ్డి గుమ్మం.

13) యోగం లేని జీవితమంతా తప్పే!

14) తిరిగితే తిప్పలు - కూర్చుంటే కుప్పలు.

15) కాయలు కాయని చెట్టు క్రింద కూర్చోవాలి.

16) వినడం కూర అంత వినాలి - ధ్యానం అన్నమంత చేయాలి భగవంతుని గురించి.

17) ఏసూ, రాముడు వేరు కాదు.

18) ఓర్పు ఉండాలి - ఓర్పే దేవుడు.

19) ఇది "నేను" కాదు - ఇది "నేను" కాదు - అనుకుంటూ పోతే చివరకు మిగిలినదే నేను, ఆ "నేనే" భగవంతుడు.

20) ఇది ఇక రాదు - ఇక జన్మకు రాదు.

21) ఇక్కడకు వచ్చాక కూడా ఖర్మ ఎక్కడుంది?

## అచ్చమాంబాష్టకము

1) కరేపాత్రం గృహీత్వా చ అటన్భిక్షాం గృహేగృహే।
గృహస్థానను గృహ్ణంతీ సాధుమాత నమోస్తుతే॥

2) చివటం గ్రామవాసీ చ రామాలయ నివాసినీ।
సర్వభక్త సమారాధ్యా సాధుమాత నమోస్తుతే॥



3) **పుత్రవత్** పాలయన్తీచ దీనాన్హీన జనాన్ దయా।
**దిగంబర** స్వరూపిణ్యై సాధుమాత నమోస్తుతే॥

4) **శాంతరూపా** సత్యభాషీ చిన్తాలాప వివర్జితా।
**దేహశూన్యా** ధ్యేయరూపా సాధుమాత నమోస్తుతే॥

5) సహజానంద స్వరూపా చ భక్తానాంచ వరప్రదా।
భుక్తి ముక్తి ప్రదాతా చ సాధుమాత నమోస్తుతే॥

6) సంతత ధ్యాన మగ్నాచ బ్రహ్మానంద స్వరూపిణీ।
సదాద్వైత స్వరూపిణ్యై సాధుమాత నమోస్తుతే॥

7) నమోవధూత సర్వజ్ఞే సర్వశక్తి సమన్వితే।
రామతత్త్వ స్వరూపిణ్యై ప్రేమరూపే శుభప్రదే॥

8) నిర్వికారా నిరాహా చ నిరాలంబా నిరంజనా।
నిర్మమా నిశ్చలా నిత్యా సాధుమాత నమోస్తుతే॥

9) **యతినా** స్వస్వరూపేన ఆనందేనాష్టకం శుభమ్।
**రచితం మోక్షదం** చైవ భవేదాచంద్రతారకమ్॥

10) **దిగంబర స్వరూపాయాః** స్తోత్రమేతత్పఠేత్పుమాన్।
ససర్వసిద్ధిమాప్నోతి అచ్చమాంబా కృపావశాత్॥

**ఓం తత్ సత్**



ఆశ్రమ ఫోన్స్ : 21013, 23711

సంఘం అధ్యక్షులవారి ఫోన్ : 25126

STD : 08819 RSTD : 919

శ్రీరామ్ గ్రాఫిక్స్ - తణుకు. ఫోన్ : 24595